

ముళ్ళపూడి వెంకటరమణ

**రమణ రచనకి బాపు అక్షరాభిషేకం!**






బాపుగారు
సంపూర్ణంగా
అక్షరాభిషేకం
చేసిన

రమణగారి
ఏకైక
రచన
ఈ

తొలిసారి



జన్మదిన ప్రతిష్ఠాత్మక ప్రత్యేక
సంచిక (ఫిబ్రవరి, 2000) లో
ప్రచురితం!



ముళ్లపూడి
వెంకట
రమణ

వాహిని బుక్ ట్రస్ట్



ఇం.నెం. 1-9-286/2/P - (రింగ్ రోడ్డు వద్ద)
విద్యానగర్ :: హైదరాబాద్ - 500044

**SRUNGAARA SAAKHAA CHANKRAMANAM**

*(Exactly as originally printed in RACHANA - Telugu Monthly :: February, 2000)*

*by* ***Mullapudi Venkata Ramana***

First Edition : 24, February, 2013

Publication No. 109

Art work : ***Padmasree*** Dr. Bapu



*Produced & Published by :*
**Vahini Book Trust (V.B.T.)**
*'Yadlapati's Home'*
H No. 1-9-286/2/P
*(Near Ramnagar Gundu*
Vidyanagar
Hyderabad - 500 044
Ph : 040 - 27071500




*Sole Distributors :*




**M/s. Navodaya Book House**
*H.No. 3-3-865*
*Opp. Arya Samaj Mandir*
*Kachiguda, Hyderabad - 500 027*
Ph: 040 - 24652387

*Layout & Designed by :*
**Rachana Entinti Patrika,** Vidyanagar, Hyderabad - 500 044

*Text & Title Printed at :*
**Charita Impressions**
1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020

Total Pages : 30

Price : ₹ 60/- :: US $ 10

ISBN : 978-93-81931-09-7


16.12.99

MULLAPUDI VENKATARAMANA
2ND FLOOR 4 GREENWAYS RD. EXTN.
R.A. PURAM
CHENNAI 600 028
TEL. 493 7109

TARA

**అనుకోకుండా.......**

19వ సహస్రాబ్ది చిట్టచివరి రోజున పై ఉత్తరం అందుకోవడం జరిగింది.

'రచన'కు బాపురమణగారలు నూతన సహస్రాబ్ది సందర్భంగా

అందించిన కానుక! - అనిపించింది.

'అమందానంద కందళిత హృదయార విందుండనై......' లాంటి భావన!

ఆసరికే 'రచన' నూతన సహస్రాబ్ది + జన్మదిన ప్రతిష్ఠాత్మక సంచిక తుదిమెరుగులు దిద్దుకుంటున్నది. మరో ముప్ఫయ్ రెండు పేజీలు పెంచి ఈ అపురూప రచనని కూడా రచనాభిమానులకు అందించగలగడం ఓ గొప్ప మధురానుభూతి!

అప్పటికే ముఖచిత్రం తయారైపోవడంతో రమణగారి రచనను ముఖచిత్ర రచనగా మలచడం కుదిరింది కాదు.

ఆ అసంతృప్తి అలా ఉండిపోయింది ఇన్నేళ్లుగా!

ఇప్పుడు బాపుగారు ఈ రచనకు ఒకటి కాదు - రెండు ముఖ చిత్రాలు అందించి ఆనాటి అసంతృప్తిని మటుమాయం చేసేరు.

'రచన' నూతన సహస్రాబ్ది + జన్మదిన ప్రతిష్ఠాత్మక సంచిక - 716 పేజీలతో - 960 గ్రాముల బరువుతో - ₹ 116/- వెలతో వెలువడి అపూర్వాదరణ పొందింది. ఇప్పటికీ ఆ సంచిక కాపీల కోసం రచనాభిమానులు అడుగుతున్నా అందజేయలేని అశక్తత!

ఏ పత్రిక వారైనా రమణగారి రచనను ప్రచురించడానికి తహతహలాడుతుంటారనడంలో అతిశయోక్తి ఎంతమాత్రమూ లేదు.

అలాంటిది రమణగారే అయాచితంగా, చాలా ఏళ్ల తరువాత రాసిన, ఈ విలక్షణ రచనని 'రచన'కు పంపుతూ అలా వినమ్రతతో ఉత్తరం రాయడం వారి సంస్కారాన్ని తెలియజెప్తుంది.

'రచన' పట్ల వారి కున్న ఆపేక్ష అది!

రమణగారి రచనలన్నింటికీ చిత్రార్చన చేసినా వారి ఈ ఒక్క రచనను మాత్రమే బాపుగారు సంపూర్ణంగా అక్షరీకరించారు. ఓ అర డజను రేఖా చిత్రాలనూ అందించారు.

దాన్ని యథాతథంగా ప్రచురించే మహద్భాగ్యం 'రచన'కు కలగ జేసిన బాపురమణలకు ఆనాడు కృతజ్ఞతాభివందనాలు తెలియజేసుకోవడం జరిగింది.

పన్నెండేళ్ల తరువాత ఈ రచన ఒక్కటే విడిగా చిన్న పుస్తకంగా తీసుకురావాలన్న తలంపు కలగడం, అందుకు బాపుగారు పచ్చజెండా ఊపడం చకచకా జరిగిపోయేయి.

దంపతులైన ప్రతి ఒక్కరూ రమణగారి ఈ 'శృంగార శాఖా చంక్రమణం' చదివి, ఆస్వాదించి అమందానంద కందళిత హృదయార విందులై ఇతర దంపతులచేత కూడా చదివించి తీరాల్సిన రమణీయ రచన ఇది!

- 'రచన' శాయి

శ్రీ.

## ~ శృంగార నానా చమత్కారములు ~

- ముళ్లపూడి వెంకటరమణ

అందుకున్న పళ్లకన్న అందనివి బహుతీపిరా
కొరికి చూసిన వాటికన్న దొరకనివి తీపిన్నరా

- శృంగార నవ తరంగిణి . ౨౩.౩౫

పంచదార కన్న పరదార తీపిరా

- దేవులపల్లి కృష్ణశాస్త్రి

వనిత తనంత తా వలచి వచ్చిన చులకన కాదె ఏరికిన్

- అల్లసాని పెద్దన

అడగక ఇచ్చిన ముద్దే ముద్దు

- ఆత్రేయ

అడిగిన ఇవ్వని ముద్దే ముద్దు

- అనవృతు , వావృతు

వినయా చిత్, దియా చుంబన్

- కింతు పరంతు

ప్రేమ పస ; పెళ్లి నస

- యానన్

పెళ్లాం తీర్చిన కోరిక
ప్రియురాలు తీర్చని కోరిక

- బివ్వాల్లా ఇది

తీరేవరకే కోరిక
తరవాతంతా బోరిక

- స్వినెట్టీ మొదిల్గియానో

గాలు

మ మ్మ మ్మ ముద్దంటే చేదా
నీకా ఉద్దేశం లేదా

— ఆరుద్ర

బంగారం కన్న శృంగారం బరువు

— తిలోత్తమ

ముద్దెట్టుకున్నట్టు - ముక్కెట్టుకున్నట్టు గాదు

— గురజాడ వెంకటేశం

మ్మ... ముద్దులు మూడు విధమ్ములు
ఇచ్చే ముద్దు రుచి ; ఇప్పించుకున్నది రుచిన్నర ;
ఒప్పని ముద్దు రుచి మ్మహ్హావు

— శృఙ్గార నవ తరఙ్గిణి - ౬౨౧౧౮

ఆల్ కెమిడీస్ ఆర్ ఎండెడ్ బై మారేజ్
ప్రేమకథలన్నీ పెళ్లితో 'అంతం' అవుతాయి

— డాన్ వాన్ & లార్డ్ బైరన్

సిద్ధాంత మద్వైతంచ
అర్థ రహితం తథా కదా ।
ఇద్దరు (మిథునం) లేనిదే మైథునం అసాధ్యం కదా
అందువల్ల అద్వైతము అర్థరహితం

— చార్వాక సంహిత

కోరిక అనే కర్పూర హారతి
పరిమళ విహారతో - శృంగార విన్యాసాలు

— కర్పూర వసంత రాయలు

గాలి

వెదురింటి తేటి కాటేస్తే
వెదురు వేణువై పాడింది — కాళిదాసు

మైథునం చేసి బుస్తోంది!
ద్వైతాద్వైత సమన్వితమ్
ఇద్దరమ్ సమరమ్ జరిపి
ఒక్కరమ్ ప్రహసనమ్! — కాళిదాసు

రతి సర్వత్ర వర్జయేత్ — యతి

మితి సర్వత్ర వర్జయేత్ — రతి

పతి సర్వత్ర వర్జయేత్ — బహుపతీ-వ్రత

సతి సర్వత్ర వర్జయేత్ — స-వతి

ఎవ్విరి యాక్షన్ ప్రొడ్యూసెస్ ఈక్వల్ రియాక్షన్
— సర్ ఐజాక్ న్యూటన్
(ప్రతి క్రియకూ దానికి సమానమైన ప్రతిక్రియ)

ప్రతి క్రియాణాం శోభనేత్ర
రతి క్రియాం ప్రతీక్షణామ్-
— రంభాగ చిన్నమణి

౧౨.

కర్పూరం కొబ్బెర్రే యిది చిరకాలపు చివి కాదు. బతుకు బాట బారెడైతే, శృంగారం పొడుగు బెత్తెడే. కోరిక తీరేవరకే శృంగార రసం; ఆ తరవాత నీరసం. అయినా గంటసొక్క పాల గంటైనా చాలు. సంసార సారం ఇదేనన్నట్టు, జీవకోటికి దీనిపైన మక్కువ ఎక్కువ

శృంగారానికి పరమావధి సంభోగం; దానికి పరమావధి ఆనందం. కుంభగత ప్రదీప కళిక వలె - నిశ్చల నిర్మలానందం. ఆనందో బ్రహ్మ అనిపించే తురీయావస్థ.... అది కొన్ని క్షణాలే.... తరువాత ప్రమద లోని స్త్రీతత్వం నిండుకోగానే, దీపం ఆరి వత్తి కొడిగట్టి - పొగలు దిగులుగా లేస్తాయి.

చెట్టు మీద దోరజామ పండును చూడడం, నోరూరడం, కోయడానికి ఎగరడం, అందడం, కోయడం, కొరకడం (తొలిపాటి), నమలడం - ఇదంతా సరదా - శృంగారం. దానిని నమిలి మింగి వేశాక ఒక్క క్షణం తృప్తి - ఉత్తర క్షణంలో - తేనుపు - బ్రేవ్!

అయినా - అనిత్యమూ, అసత్యమూ, క్షరమూ అయిన ఈ శృంగారన్నే పదునాలుగు భువనాలూ యుగయుగాలుగా ఆరాధిస్తున్నాయి.

సంభోగం స్వర్గంలో కూడా ఉంటుంది. కాని శృంగారానికి కరువే- అడగ్గానే ఒప్పుకుంటారు కదా - అంచేత సర్వ సాధారణం. లేనిదే కోరుకునేది శృంగారమే. అక్కడ చాలమందికి శృంగారం గురించి తెలీనే తెలీదుట!

ఒక కవిఋషి స్వర్గానికి వెళ్లాడు. చాలా ఆత్రంగా వున్నాడు. - ఏం కావాలయ్యా అని అడిగాడు ఇంద్రుడు. 'రంభోగం' అన్నాడు ఋషి

అంటే?

అదే స్వామీ - రంభతో.... అంటూ సిగ్గుపడి పోయాడు.

'రంభా సంభోగం' కుదించి రంభోగం అన్నావా! సెబాష్ కవీ.

ఆ తోటలోకి వెళ్లు. రంభ వస్తుంది - అన్నాడు ఇంద్రుడు.

తోటలోకి రంభ వచ్చి నిలుచుంది - మెకానికల్‌గా బట్టలు విప్పదీస్తూ, కవి కవిత వేగంతో పెట్రేగి పోయాడు.

గాలు

ధన్యుడిని రంభాదేవీ అన్నాడు దండం పెట్టి.

అప్పుడేం? ఇంకే....

అంటే నిన్ను చూసి ధన్యుడినయ్యాను. నీ కళ్లు కలువ రేకులు. పెదవులు దొండపళ్లు. కుచములు కుంభస్థలములు. తొడలు అరటి బోదెలు. ఘనజఘనలు ఇసుక తిన్నెలు అంటూండగా రంభ బెదిరి చూసి దుప్పటి కప్పేసుకుంది.

వాటితో పోలుస్తున్నావు కవీ - నా అంగాలకన్నా అవే అంత బాగుంటే వెళ్లి వాటినే వాటేసుకు పండుకో అంటూ రంభ జంభారి ఇంటికి వెళ్లిపోయింది.

స్వర్గానికి వచ్చిన అతిథుల కోసం పెట్టిన ఛైటే కుదరక పోతే ఆనాటి రంభా సంభోగం ఇంద్రుడి కోటాలో పడుతుందిట. (దన్నమాత్రం సచీదేవి అభ్యంతర పెట్టకూడదు - అది రూల్సే - బుక్కు చూడు)

అయ్యో! శృంగారం కోసం నయగు పంక్తులంటే పోల్చుంటావా! ఈ ఉపమాన భంగం భరించలేను అంటూ కౌగిలి పట్టాడు కవి.

సంభోగం అనేది కేవలం విధి నిర్వహణ అయినందువల్ల - రంభకి శృంగారం బొత్తిగా తెలీదు. అందుకని కవిగారు పాట్లు పేస్తే అలా అపార్థం చేసుకుంది.

కానీ స్వర్గంలో సంసారాలు చేసుకుంటున్న ఇతర దేవగణాలకూ - వారి యేమిటి - సాక్షాత్తూ విష్ణువుకూ శృంగారం అంటే ఎంతో సరదా. కానీ స్వర్గానికి అందుబాటులో లేదు.

అందుకే -

ఎన్నో కోట్ల భూలోక భక్తులతో కళ్లు పట్టి లక్ష్మీదేవితో శృంగారం కొరవడి తనను కొల్లలో తన్నే సత్యభామ శృంగారం కోరి, శ్రీవైకుంఠ విరక్తుడై భూలోకానికి దిగి వచ్చాడు.

ఆయనే కాదు - ఎందరో దేవతలు, స్వర్గం చేరిన ఋషులూ, దుర్వాసులాటి అప్సరలూ నోళ్ళు ఇప్పించుకుని మళ్ళీ భూలోకానికి దిగి వచ్చారు ఉబలాటంతో!

## రుచి

శృంగారానికి ముడి సరుకు సౌందర్యాకర్షణా, వికర్షణా. కృష్ణం కలయ సఖి 'సుందరం' అన్నాడు కవి. సుందరుడైన కృష్ణుడిని చూడు అన్నాడే తప్ప పరమాత్ముడైన కృష్ణుడిని చూడు అనలేదు.

శృంగారం అంటే భోగ చైతన్యం. అల్లరి. నవ్వడం, కన్ను కొట్టడం, (కె.పి.ఎస్) గిచ్చడం, తెంపరితనంగా, కవి తన్మయంగా తినడం వగైరా సరదాలు.

భోజనం కూడా కొందరికి శృంగారం, కొందరికి ఆహారం. వంటకాల సౌందర్యం చూస్తూ, కొత్తిమీర పరిమళం ఆఘ్రాణిస్తూ, ఆవకాయను ఆస్వాదిస్తూ భోజనాన్ని ఆరగిస్తారు. మరి కొందరు - ఆకలి తీరడం కోసం అన్నం మింగడం.

ఆకలి లేనివాడికి అన్నం రుచి తెలీదు; సరదా లేనివాడికి సంభోగం రుచి తెలీదు. స్వర్గంలో ఈ సరదాలు లేవా - అంత చప్పగా వుంటుందా?

సకల దుర్వ్యసనాలు గల ఒక మహాపాపి మరణించి పాతాళలోకం చేరాడు దిగగానే స్కాచ్ విస్కీ అన్నాడు. సీసాలు కొద్ది ఇచ్చారు. చికెన్ పలావ్, ఫిష్ కర్రీ, కౌజు మాంసం అన్నాడు; తెచ్చారు. నర మాంసం అన్నాడు; రంభ వాళ్లొచ్చారు ఇలా అడగ్గానే అన్నీ ఇస్తున్న ఒక పది రోజుల్లో బోరు కొట్టాయి అన్నీ — 'దరిద్రం. ఇంతకన్నా నరకం బెటరు. అక్కడికి తీసుకుపోండి' అని అరిచాడు. 'నాయనా! ఇదేరా నరకం - ఇది నరకమేరా!' అని జవాబు వచ్చింది.

రామాయణ కథలో సీతారాములు అయోధ్యలో పదేళ్లు హాయిగా కాపురం చేశారు. పదునాల్గేళ్లు అడవి పాలైనా సుఖంగా వున్నారు. ఆ కథ యాకేగా నడిచింది. సూర్పణఖ వచ్చి కాస్త శృంగారం చెయ్యగానే చెరువులా వున్న జీవితం సెలయేరై పరుగెత్తింది.

సంగీతంలో కూడా సరిగమ పదనిస అంటూ మాయామాళవ గౌళ రాగం ఒకటి వుండేది. తినగ తినగ గారెల్లా వినగ వినగా కనరెక్క సాగింది. అప్పుడు స్వరాల తుంచి వుంచి మార్చి పరిమార్చి తేడాలు తీసుకువచ్చారు.

సరిగపదస అంటే మోహన. సగపదనిస అంటే హంస ధ్వని. ఒక మధ్యమానికి మనోహరంగా నిషాదాన్ని చేరదీస్తే - ఎంత రుచి!

~~~

ఇలా సాగగా క్రమంగా మేళకర్తల కడుపుల్లోంచి వేలాది రాగాలు మేలుకొన్నాయి. కృష్ణుడి పదహారువేల రమణులలాగా – ఎందరున్నా అందరిలోనూ సత్యభామ ఆకర్షణే కృష్ణుడికి పెద్ద ఆకర్షణ.

ఆకర్షణ బలం వల్లనే సూర్యుడిచుట్టూ గ్రహాలు తిరుగుతున్నాయి. భూమికి గల ఆకర్షణ వల్ల చెట్టుమీద పట్టుతప్పిన పళ్లు కింద పడిపోతున్నాయని ఐసాక్ న్యూటన్ కనిపెట్టాడు. ఇందులో ఒక విచిత్రం! భూమి ఆకర్షణ ఎంత శక్తిగలదైనా పైన వున్నదాన్ని కిందకి లాగేస్తుంది. కాని శృంగారం వేరు. పైన కింద కాక కుడి ఎడమా అటూ ఇటూ ఎటుపడితే అటూ నిలువునా అడ్డంగా ప్రేమను ఆకర్షించగలదు.

మధ్యాంగి కనుదోయిని ఆకర్షించే చనుదోయి శక్తి అంతటిది! దేవతలూ ఋషులూ యోగులూ వాళ్లనుకరించి పాడిన మహామహా కవులూ చనుదోయి ఆకర్షణ నుండి తప్పించుకోలేక పోయారు.

శ్రీ వేంకటేశ్వర స్వామి - కాంత కుచాంబురుహ 'కుట్మల' లోల దృష్టుడు. కమలా కుచ చూచుక కుంకుమతః నియతారుణిత అతుల నీల తనుడు... శ్రీవక్షోజ కురంగనాభ మెదపై చెన్నొందు ... శ్రీ కుచాగ్రపరి చేలాంచలమైన వాడు... కుచోన్నతం కుంకుమ రాగం ... కోమలి కంటి నీరు చనుకట్టు పయింబడ నేల యెట్టిదో హాటక గర్భరాణి - (ఏడుస్తున్న కన్నులకన్న ఆ కన్నీటి బిందువులు రాలిపడే చనుకట్టే దృశ్యమానం... సంగీతంలో సాహిత్యంలో సరస్వతీ స్తనద్వయం ... ఆండాళ్ ని స్తుతిస్తూ పరాశర భట్టరులు - 'నీలమ్మ చనుగొండ నెత్తమ్ములందు సోలి నిద్రించు కృష్ణుని మేలుకొల్పి' అన్నారు.

ఆముక్తమాల్యద కథలో కన్యాలోకేళ, పెళ్లికూతురు ఆండాళ్ - పెళ్లికొడుకు తలమీద తలంబ్రాలు పోసే వేళ ఆ మురారి 'ఉబ్బుపాలిండ్ల క్రేవ ప్రక్కన కన్నువేయుట గని' ఆండాళ్లు బాహువులను ముడుచుకుని ముత్యాలను దోసిళ్లతోనే ఎగచిమ్మిందట! కొద్ది ఘడియలలో తనది - తనదే కాబోతున్న స్తన సంపద పై రంగనాథుడు దొంగచూపుల బాణాలు సంధించడానికి? అవి దగ్గరై తన కౌగిలి చేరిపోతే చూపులు తూపులు వేసే దూరం ఉండదని?
~~~

'ధర ధరేంద్ర నందినీ కుచాగ్ర చిత్ర పత్రక
ప్రకల్పనైక శిల్పిని త్రిలోచనే రతిర్మమ..'
- దశవక్త్ర భుజంగ ప్రయాత గీతం — రావణాసురుడు

(పార్వతి కుచాగ్రాల మీద చిత్రాలు వేస్తున్న శివుడిని పూజిస్తాను)

దేవుడూ భక్తుడూ రక్తుడూ విరక్తుడూ - అందరూ కుచాగ్ర లుబ్ధులే!

పెద్దవాళ్ళు సరే - పిల్లలను కూడా విడిచిపెట్టలేదు ఈ ఆకర్షణ.

అందరికళ్ళ పసిబాలుడు ప్రహ్లాదుడు కూడా 'అన్నకింత పట్టింపైన' - రాకూడని స్థాయి వచ్చినపుడు - 'మాతృభావము చేసి మరలువాడు' ట!

తన కొమ్మని పట్టుకున్న పాకీశ బాలకృష్ణుడిని తప్పునీది అని గోపిక నవ్వుతూ మందలిస్తే - పాలకోసం అని నవ్వాడట! సిగ్గులోపంతో తలమునకలై పోయింది. ఇటు వాత్సల్యం - అటు శృంగారం అనే 'రెండు తనం' కున్న పిండుమనసు స్త్రీ మాత్రదే! ఒక వంక పసిబిడ్డ ఒక కొమ్మన పాల తాగుతూ వుండగా పారవశ్యం - మరొక వంక భర్తగారి కరకృత శృంగారానికి పులకరింతలూ..
ఈ నిత్య నిత్య సత్య సత్య ప్రియ శృంగారాలు ఎల ఆవిర్భవించాయి!

*

—ఆది మానవుడి బతుకుబాటలో ఈ పదాలు వుండేవి కావు
ఆడది కనిపిస్తే, కోరిక మెలుకుంటే దగ్గరకు వెళ్ళి మాటగా పాయింటు చెప్పేవాడు 'ఓ కోమలీ - నిన్ను మోహిస్తున్నాను./ ఓ మోహినీ! నిన్ను కామిస్తున్నాను. కలన సంభోగం అనుమతించవలె.' అనేవాడు. ఆవిడ 'సరే' అంటే సరే - లేక పోతే మరో మగువ కోసం క్షేత్ర యాత్ర

మత్స్యగంధితో పరాశర ముని ఇలాగే మాట్లాడాడు. నదిపై పడవపై మహిమా హిమాచ్ఛాదన మరుగున సంభోగం అనే కార్యం నిర్వహించాడు వ్యాసుడు సంభవించాడు!

*

అసలీ సంభోగం ఏమిటి? చెప్పింత మనిషిని పడుకోబెట్టి - ఈ పరకాయప్రవేశం ఏమిటి? పదవ!

~~

హ్యూబర్ట్ మార్కస్ రచించిన పిక్చర్ ఆఫ్ మేన్‌కైండ్ గుర్తొస్తుంది - వినండి.

ఆదిమానవుడూ మానవీ ఒక రోజు గుహలోంచి బయటకొచ్చారు. ముందుగా పళ్లూ చేపలూ తెచ్చుకోడానికి బయలుదేరారు.

ఆహార నిద్రా భయాలు మైథునాలూ వాళ్లకి మొదట్నుంచీ తెలుసు. ఆడ మగ తేడాలు కూడా అంతగా తెలీవు. కళ్లూ చెవులూ కాళ్లూ చేతులూ వగైరా ఎక్విప్‌మెంట్ ఇద్దరికీ సమానంగానే వుంది - బొడ్డు కింద ఒక చోట తప్ప - కొంచెం అటూ ఇటూగా సమానంగానే వున్నారు.

ఆ ఒక్క తేడా గురించి చెప్తూ చెప్తూ ఒక సభలో వక్త - "దేర్ ఈజ్ ఏ ఫండమెంటల్ డిఫరెన్స్ బిట్వీన్ మేన్ అండ్ వుమన్" అని ఆరంభించాడు. 'వైవా లా డిఫరెన్స్' (ఆ తేడాకి జిందాబాద్) అని అరిచాట్ట సభలోని ఒక ఫ్రెంచి శ్రోత -

సరే - ఆదిమానవులిద్దరూ గుహ బైట నించి అటూ ఇటూ చూస్తుండగా కొండ మబ్బులు మీదకొచ్చేశాయి. చీకటి. చీకట్లో మెరుపులూ ఉరుములూ - దగ్గర్లోనే పెద్ద శబ్దంతో గుండెలదిరేలా పిడుగులు పడ్డాయి. కుంభవృష్టిగా వర్షం.

ఇద్దరూ గుహలోకి పరిగెత్తి భయంకొద్దీ ఒకరినొకరు గట్టిగా కౌగిలించుకున్నారు... కున్నారు... కున్నారు... అలాగే వున్నారు... కొన్ని ఘడియల తరవాత చలి తగ్గింది. అంతేకాదు. అంత చలిలోనూ చెమటలు పట్టాయి. కళ్లు తేలిపోతున్నాయి. ఒళ్లు తూలిపోతోంది. ఈ భయం - తిండికన్నా నిద్రకన్నా బాగుందే అనుకున్నారు. వాన వెలిసింది.

*

మళ్లీ ఎప్పుడుగా వర్షం వస్తుందా అని ఎదురుచూడసాగారు. అది వస్తే గుహలోకి వెళ్లి భయంతో వాటేసుకోవచ్చు.

చివరికి విసుగేసి బయట నించే - 'వానరా! ఏలారా!' అంటూ చప్పట్లు కొట్టారు. అదే ఆది తాళం.

~

చిందులు తొక్కారు ఆదే ఆదినాట్యం

అరిచారు. హాహా అన్నారు. ధాంధాం తప్ తప్ అన్నారు.

ఆది శబ్దం ఆది సాహిత్యం.

కొన్నేళ్ళకి వర్షం పడింది. వాళ్ళు భయంతో నటించారు గుహలో దూరి వాటేసుకున్నారు. ఈ సారి వర్షం పడుతోంటే నయనాల ఆనందం కురిసింది. భయపడి పడి వాళ్ళకి విసుగేసింది.

ఇంకేముంది అని చప్పట్లు కొట్టారు.

ఇద్దరు పిల్లలు పుట్టారు.

సంభోగం మీద పవిత్ర భావాలు 'సరికొత్త రక్తాన్ని' సంతానానికి మేలుకొన్నారు. అర్థవంతంగా సృష్టి సాగింది.

*

సహజంగా ఉన్న సంభోగ పర్వంలో అబద్ధం ఎలా పుట్టింది?

శ్రీమహావిష్ణువు నాభి నుంచి పద్మము, అందులోంచి బ్రహ్మ ఆయన నాభి నుంచి భాష, ఆ భాష నుంచి బద్ధమూ అబద్ధమూ పుట్టాయి.

'రెండెందుకూ? మనిద్దరం ఒకటే కదా! అంత పరబ్రహ్మమే కదా – మరి ఈ బద్ధబద్ధాల రెండు పదాలెందుకు?' అని అడిగింది సరస్వతి.

'రెండేసి ఉండాలి దేవీ. నా చేతి వీణ నువ్వు ఒకటే అయితే వాయించేదెవరు? వినేదెవరు? చెరుకు గడా నేనూ ఒకటే అయితే రుచి తెలిసేదెవరికి? ఎలా? నువ్వూ నేనూ ఒకటే అయితే సంయోగం ఎవరితో? ఎలా?'

'అంటే మనిద్దరం ఇద్దరం అంటారు. రెండూ అంటారు'

'అంతే కద'

'ఒకటే అనుకుని పెళ్ళికి ఒప్పుకున్నాను' అంది వాణి చిరుకోపంతో.

బ్రహ్మ ఉపహాసం చేసెను.

~

చెమటలు సెలయేళ్ళుగా కారుతున్నాయి. అతడు ఒగరుస్తున్నాడు.
ఆమె అలసిన వయ్యారంగా వెనక్కి వాలి కృష్ణుడిని చూసింది - వాడి అందం
వాడి తృప్తి కలిస్తే ఎలా వుండేదో అనుకుంది.

పాదచారియైనాయన ఇదంతా గమనిస్తున్న భర్తృహరి చిన్న బండనెక్కి
ఆకాశాన్ని చూస్తూ ఆవేశంతో శ్లోకం ఆరంభించాడు.

జల్పన్తి సార్థమన్యేన పశ్యన్త్యన్యం సవిభ్రమాః ....

అని ఆగాడు.

అప్పటికింకా దేవభాష భువికి దిగి రాలేదు.

వాళ్ళకి తెలియరాదు. 'సంస్కృతంలో కోప్పడితే ఏం లాభం' అనుకున్నాడు.
ఆయన పై కొమ్మ మీద కూర్చున్న పక్షుల కవి ఇలా అన్నాడు.

ఒకనితో గూడి భాషించు నొక్క నరుని
జూచు విలాస సుందర సొంపు నయన
మరియు నొక్కని మది తలచు మనసులోన
నాల్బ్రియము డెవ్వడో ముద్దుగుమ్మలకును!

ఆయనైనరా - పొట్ట కొంచెమైనా కూత ఘనం అంటూ అనాకన
పక్షుల కవిని చూసింది వనసుందరి.

భర్తృహరికి ఒళ్ళు మండింది.

'కూత వాడిదైనా రాత నాది' అంటూ పై కొమ్మవైపు చూసి అందు
మాటున్న కవిని మందలించాడు.

ఇదంతా గమనిస్తున్న మొదటి వాడికి ఒళ్ళు మండింది.
తన కేళిగా వుండగానే ఇంత కథ నడిపించిన ఈ గ్రంథసాంప్రదాయిని
విడిచి వెనక్కి జరిగేసి మేనక దగ్గర విశ్వామిత్రుడి భంగిమ పెట్టాడు.

'ఓ కోమలీ పిరిచే! నీ ప్రేమ అబద్ధం. నువ్వు నన్ను కోరి
తరవాత వాడికేసి తిరిగి, మళ్ళీ నాకేసి చేరి, నా భుజాల మీంచి వాడిని
చూస్తున్నావు. నీ మనసు అక్కడే వుంది. హా అయ్యో' అంటూ

~

జలపాతం కింద స్నానం చేస్తున్న మరొక వరరోమకేసి పలుకెత్తదు.
భీష్మ పిత సమాన హేమాద్రి బ్రహ్మచారి. తిరిగి చూడవలేదు.
కిరణం- నేను రాలేదు. అందుకని అంబ బతుకుతో చదరంగమాడి
చివరి, చివరికి శిఖండి చేతిలో చావుకు తెచ్చుకున్నాడు.

*

సంభోగ తత్పరత్వ శృంగారం ఎంత సరదాగ వుంటుందో
సంభోగోత్తరం అంత సంభీరంగా - ఇదీ- ఉతగ చెక్కి వుంటుందంటారు
కిరి తెలిసిన దగ్గర చేస్తే తుమ్మెద వగ రకరకాల పూల మీద షికార్లు
చేస్తే దానికి మాత వదులుతూ తప్పుపెట్టనట్టు విప్రలంభ
శృంగారం చెలరేగుతుంది. అందుకే ఎన్ని కవిత్వాలు
చమత్కారాలు మిత్రయాలు పోషపాలు పుతంతలు సిరలు, ఎండని
నీడని చెలియని చలిని వెన్నెలని వేడిని పాలడుతూ తెలడుతూ
భువన మోహన కల్పనలు - అష్టవిధ నాయికల కష్టాలకే విరహ
విన్యాసాలు.... వహ్!
కిరాతెర దనుజ మర్దన కందుకూరి జనార్దన....
చెక్కుచెవ్వాతే నొక్కర.... విను విధులకేను రంటర.... తెల్లవారెన దాక
ఎక్కడ తిరుగు పాడతి చెప్పర ....(న) బట్టకట్టి చెయ్యి వేయకురా ....
గండి దొంగవు దనుజమర్దన కందుకూరి జనార్దనా - అంటూ
నాయిక న-సాధిస్తుంటే -
రావే చెలువ కొంప! రూపవతి రమా మనోహరిణీ!.... బాల మొక్కెదర
కిరీటయ్యగదవే ఫాలాంబుజాక నిప్పవే - అంటూ నాయకుడు
ప్రాధేయపడతాడు.
నాయిక కరిగిపోతుంది.
కంటినేత్రము పంట చూసితే జడి పువ్వుల పూసెర!.... కంటిలోన దాక
పండువెన్నెల కాయుచున్నది ఏమిర! అంటూ ముద్దు చేస్తే

కదియిందర దనుజ మర్దన కందుకూరి జనార్దన
అంటూ సెలయేరు మాటకు పలుకుతుంది.
జారిణి దరి చేరు... మనసు వూర తేదు. అత్త మంచం పట్టె - చెలితదే
మట్టదే - ఇరుగు పొరుగు తెలి యంతంత కొంప - నాకు భయంగా వుంది
అంటుంది పాటలో నాయిక జారిణి - మనోంతికంగా - కోడెగానికి
వినబడేలా —

*

'సంభోగానంతరం (వెంటనే కాదు) చాలకాలం గడిచి, జవసత్త్వాలుడిగి కోరికలు (పండుటాకుల్లా) రాలిపోయాక కూడా — కొందరికి భార్య/భర్త/పట్ల ఆపేక్ష ఆదరణ స్నేహం తగ్గక పెరుగుతాయి

'నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము —'

అంటాడు సుదాముడు. దేవుడు వరమిస్తానంటే సంపదలో - ఏకంగా మోక్షమో కోరకుండా - నీపట్ల భక్తి కావాలి అనడం భగవద్భక్తికి పరాకాష్ఠ.

అలాగే భార్యా భర్తలు కూడా - శారీరక కోరికలు తీరి శృంగారావసరాలు తీరిన వయసులో ఒకరి నొకరు ప్రేమించుకోడమే అత్యుత్తమ శృంగారం. వారి చూపుల్లో పెరిగి అల్లుకునే అనురాగమనురాగలత శోభాయమానమైనది. ఆకొత్తర సౌరభాలతో వెల్లివిరిసేది. పెనుగాలి వీచినా చెదరని ప్రదీప కళిక. అటువంటి దంపతుల్ని మనకి చూపించే గొప్పకథ - శ్రీరమణ గారి 'మిథునం'. ఆ కథలో ఆలుమగలు పండు ముసలి వాళ్లు. పసిపిల్లల చురుకుతనం పడుచువాళ్ల శక్తి చైతన్యాలూ పెద్దల వాత్సల్య వివేకాలూ అక్షరమైన స్నేహం కలబోసిన వాళ్లు - ఒకరి నొకరు వెక్కిరిస్తూ తిట్టుకుంటూ దెప్పుతూ గిల్లుతూ (కె.పి.ఎస్. కాదు) అల్లరి పెడుతూ నవ్వుతూ నవ్విస్తూ పున్నమినాటి సముద్ర) కెరటాల్లా ఎగసిపడి తేస్తూ బతుకే నిత్యకల్యాణ మంటపంగా పాలు నీటి జంటలా వుంటారు.

శృంగారం పరమార్థం సంతోషం; మోక్షం కాదు
పుట్టినప్పటి నుంచి వెళ్ళేదాకా సరదాగ బతకడం.

నిన్నరాత్రి నిన్ను కూడిన కన్నె ఎవరని అడగనా
రేపు రాత్రి చేరబోయే కన్య ఏదని అడగనా
నేటి రాత్రి నన్ను చేరితే మాట మాటకి దాయనా
పొందు కొరకే వందనాలర కందుకూరి జనార్దనా!
(ప్రక్షిప్తము)

నా భావనే.....

* * *



**SRUNGAARA SAAKHAA CHANKRAMANAM**
**(Published in Rachana - Telugu Monthly : February, 2000)**
**by MULLAPUDI VENKATA RAMANA**

బాపుగారు సంపూర్ణంగా అక్షరాభిషేకం చేసిన
ముళ్లపూడి వెంకట రమణగారి ఏకైక రచన!

ISBN 978-93-81931-09-7



30 Pages :: Price : Rs. 60/-